# ఉపోద్ఘాతము.

——:०:——

అయ్యా,

ఈగ్రంథము, శతావధానధురంధరులును కవిశేఖరాలంకార, కవిమణీత్యాది బిరుదాంకితులును, యజ్ఞోపవీతాన్వయ సంభూతులును నగు సుబ్రహ్మణ్యశాస్త్రి గారిచే రచియింపఁ బడినది. వారు నగరాగ్రమున కుప్పా వెంకటేశ్వర శాస్త్రిగారి యొద్ద ప్రతాపరుద్రీయ మను నలంకారగ్రంథమును బఠించు నపుడు నేనును, నామిత్రులును బంధుగులును నగు కుప్పా శ్రీరాములుగారును నొక కథ నిచ్చి కులాసగా కొన్ని పద్దెములు చెప్పుఁడని వేఁడితిమి. శ్రీ శాస్త్రిగారు దినదినమును వారికి దీరి నపుడు పది పద్దెముల చొప్పున చెప్పుచుండిరి. పది దినములకు మేము వారికొసంగిన కథ సంపూర్తి యయ్యెను. అప్పుడు మాటలఁ దప్పులు దిద్దుఁడని వారిని వేఁడితిమి. అవధానిగారికి మాయందు గల స్నేహాతిశయమున మా కుతూహలము దీర్చిరి. శ్రీశాస్త్రిగారు సం

పూర్తిగ నంగీకరింప కుండినను గ్రంథముగదా వృథా యేల చేయవలెనని యుపేక్షించితిని. నా యభిలాష తీర్చుటకై శ్రమ గైకొన్న బ్రిహ్మశ్రీ శాస్త్రిగారికిని నాకు మొదటినుండి యా యంశమున సహాయకారిగ నున్న శ్రీ శ్రీరాములుగారికిని ననేకవందనము లాచరించుచున్నాను. ఇం దెందేని దోషము లుండెనేని బుధవరులు మన్నింతురు గాక

ఇట్లు

కుప్పా వెంకటనారాయణ,

తెనాలితాలూకా, అనంతవరం.



శ్రీ దేవతాయనమః.

# మధురవాణి.



సీ॥ శ్రీయుల రారంగ • శెలువారు పొంబట్టు
పంచబింజలు సవరించి కట్టి
కడుసొంపుగ నేను • తొడవుల మేనిపై
మేదురం బగు కీలి • బూదిరాచి
సౌదామినియనంగ • సాటియుం బోదవించు
సొంపు జందెము సవరింపు జేసి
మొనన్నియు మించ • నిచ్చిన గంధంపు
నొక్కుల గంజాయు • చుక్క పెట్టి
గీ॥ అజినము మూపుపై జేసి • లాడ దాల్చి
నంత తౌం కారకింకిణీ•నాయుతుండగు
బసవదేవుని పై నున్న • భవుం డొసంగు
సుఖము గలిమి సుబ్రహ్మణ్య•సుకవిమణికి॥
ఉ॥ బాలవయస్సునందు నవి
వాహము నా నొకపేరు పెట్టుచున్
బాలిక లజ్జలేక జనుట
భర్తల నెవ్వరినో కుదర్చు యే

లీలనా పెండ్లి సేసెదరు
లీలగుయౌవనమున జనక ఏగుం
జేలఁడో దానికర్మ మట
యేమిటి పిరికి దిక్కు దైవమా!॥

సీ॥ బిలిబిలి పలుకులం ♦ దెలిసి తెలియ కాదు
పాయంబునందు వి♦వాహ మంట
తనపతి మనసార ♦ గనుగొనఁగా లేని
పాయంబునందు వి♦వాహ మంట
సతి నా దనుభేద ♦ మెపు సేరసి యుట్టి
పాయంబునందు వి♦వాహ మంట
జరిగెడు నమ్మహో♦త్సవ మేమొ సేరసి
పాయంబునందు వి♦వాహ మంట

గీ॥ భర్తపై ననురాగంబు ♦ వఱల నట్టి
పాయమందు వివాహంబు ♦ భావ్య మగును
బాలికామణిగణములఁ ♦ బాదు సేయు
బరగుచే కాని బాల్యవి♦వాహమిది? యిది॥

మ॥ అనురాగం బది లేక యున్న బతియం
దాసక్తి వాటిల్లునే?
చనునే శీలము సవ్వ డిర్వురకు ప్రా
త్సంధాన మేపారునే?

అనురాగాస్పదు లైన యిర్వుర నువ్వు
త్యాంతంబు వాకుఁ జెప్పెదరా
వినుఁడీ యొక్కరి నొక్క రెవ్విధమునరా
ప్రేమించిరో వారిలో॥

చ॥ గుణములకుం ధనంబునకు
సూరిమి పిద్దెలకుం గనుం జిరం
తనమును బిల్లవాయుప్రలు
తార్కొను వేళల గమ్మతావు లిం
పెనయఁగ నీను పూవుముల
కిల్లయి శ్రీలకు నాలవాల మై
తనరు నిరంతరాజపురి
ధారుణిమండల మం దెనంగెరురా।

గీ॥ ఈ మహాపురమున వసియించు చుండు
పదియుఁ బదియేండ్లపరువాన వరలుచుండు
రనవివేకుండు శీలాఢ్యరాయణుండు
మాధవుం డనుపేరిటి మానవుండు.

చ॥ మానసమా యనంగ మది
మాటికి నందియు మందఁ జేయు సొం
పైన సరోవరం బొకటి
యాపురి కొక్కెడ నొప్పు దమ్మిపూ

తేనియ చక్కెఱల్ గలిసి
తీయఁదనంబున మీఱు నంబులన్
దేనియలన్ భ్రమన్ దిరుగు
నిచ్చలు హంసలు తత్తటాకమున్ ॥

మ॥ వనసైలాసురసాలసాలనవదూ
ర్వాకేతకీచూతచం
దనపూగీనవమల్లికాదితరువి
స్తారంబు వొప్పిధాంగనా
స్తనసీగేజవరీమళప్రియచం
చఞ్చంచరీకౌఘమై
వన మొం దుండెడుఁ దత్తటాకమునకున్
బ్రాగ్భాగ మం దొప్పుచున్ ॥

ఉ॥ ఆ నగరంబునందు నవ
యౌవనవుం గళలం జెలఁగి రం
గ్గైన హొఱంగునుం గని ను
మూఁగి యొకర్తు జెలంగెదున్ గదన్
దాని గృహంబు డం బెనఁగు
దన్నగరాంగణ మందు నంగదిన్
వాని గృహంబు ముంగడల
బంగరురంగు పటంగు చెంగటన్ ।

ఉ॥ బాలకుఁ డిట్టి జవ్వనపు
బాయమునం దఁగ నూగునూగు మీ
సాలును నిందుకాన్తిపులును
జక్కని మల్లెల నవ్వు మల్లులుఁ
గాలరులుఁ గులాస నడ
కల్ పరకాంతలఁ జూపు వీధికా
జాలము నం దొయారమున
జామల నవ్వొట వృద్ధిగాఁ గనెఁ।
ఉ॥ రంగు గడానిడాల్ హొయల
రాజిలు వాని హొఱంగ అరుగుపై
నం గుశలంబుగా నొకది
నంబున ముచ్చట లాడు చుండ నీ
యంగన యల్ల నల్లనన్
యారమునం జనుదెంచి కుల్కుచుఁ
బంగరుబొమ్మరో యనఁగ
ద్వారముఖంబున నిల్చి చూచెరుఁ।
ఉ॥ బాలుని మోముగోమునకు
భ్రాంతి జెలంగి సుమాంగి భావమం
దీ లలితాంగునిం గదిసి
యిమ్ముగ మల్లెలు జాజు లాదిగా

బాల కోకాట మా తలిమ
పూం దలిపమ్మున మన్మథానల
జ్వాలల నార్పు లేని చెలి
జన్మ మికేటి కటంచు నెంచుచున్॥

సీ॥ నీలాభ్రగురు లొగిన్ • జెలరేగంగా నప
రించు నెపాన గే • ల్పొంచి యూచు
వినవీధి జక్కుల • వీక్షించు నెపమున
దిన్నఁగఁ దలయెత్తి • సన్న చేయు
పసిఁడిచాయల మేన • విసరేడు నెపమునఁ
బయ్యెద దొలఁగించి • మఱలఁ గప్పు
మేని నొప్పులదీర్పు • మిష వెట్టి సమయంబు
నెంచి యొయ్యారంబు • హెచ్చు జూపు

గీ॥ తమ్మల మ్మంటినో లేక • తగుల లేదో
చూచు నెపమున నధరమ్ము • సాఁచి చూపి
ముడచు నెపమున ముఱిపెంపు • ముద్దు గోరుఁ
గాంత లెంతటి సాహస • వంతు లౌర॥

చ॥ తరుణి వయోవిలాసముల
దాని యొయారపు జోరచూపులన్
గర యొనరించు సన్నలును
గాంచుచు నువ్విళు లూరి యూరి వా

ద్వారకకె శ్రీమం బొనంగకమె
తోరపు గుల్కు మిటారి సిసి నె
క్కరణిఁ గవుంగిలించికొనఁ
గాఁ దగు నంచుఁ దలంచె నాతఁడున్॥

గీ॥ ఇంతలోఁ బశ్చిమాంభోధి • నినుఁడు గ్రుంకెఁ
గళల నిర[illegible]ండెఁ దారకా•గణము లెల్ల
శారికాకీరవారమ్ము • లారజములఁ
బలుక మొదలిడె దిటముగఁ • బర్వెఁ దమము।

సీ॥ తమవుటేనుఁగు బలిసి లో•కమును నివ్వె
ధమునఁ గల్లోలపెట్ట స•క్రమ మటంచుఁ
గువలయేశుఁ డయ్యేనుంగు • గుంటుపఱిచి
కువలయంబున కపుడొనఁ•గూర్చె ముదము।

చ॥ తమ తమ యిండ్లకుం జనుచు
దారువుకత్తెలు నేప్పువెంపునన్
దమ సఖురాండ్రతో నడిరి
తన్నిశి నిన్నిగడెల్ జనంగ నీ
క్రిమమున నిట్టితావులకు
గాంతులు వీకలు వత్తు రంచు నీ
యమ తన కేళికావనము
నారయ బోమెనుగోర్కె వెంపునన్।

చ॥ చెలువ వనప్రదేశమును
జేరఁగ నయ్యెడి గాంచి మాధవుం
డలఘుజవంబునన్ జని వ
నాంతమునం దొక రత్నవేదికా
తలమున గూరుచుండి ప్రమ
దంబున నవ్వనిఁ జూచి యిట్టులన్
బలుకఁగఁ జొచ్చెఁ దన్మధుర
నాదము పల్దెసలన్ స్ఫురించఁగన్॥
చ॥ మలయసమీరసంచలిత
మంజులతానుమమంజరీపరి
మళరచనావిలోలమద
మాధుకరప్రకరాళులంబు ని
ర్మలమణివేదికావిహార
మాణవిలోభము భర్మడోలికా
కులచలనావధూతసుమ
గుచ్ఛభరంబు వసంత మయ్యరే॥
చ॥ అది విని వానిచెంగటకు
నల్లనఁ జేరి మఱొక్కతిన్నని
మ్మదిఁ మెయి డాసి యిట్టు లనె
మత్కుసుమస్ఫుట కేలికావనీ

పదమును జూడ వచ్చితివె
బావ! ముదం బలరారెనుమ్మ నా
మది వనభూమి యంతయును
మాన్యత మై దిలకించె నేడుగా॥

గీ॥ బావ యని పిల్వఁగా నేమి ♦ భాగ్య మమరెఁ
గలిగె నొక చిన్న పని నిన్ను ♦ గలయ నద్ది
విడక కొనసాగు నంచు భా♦వించి యిటకు
వరుగుదెంచినవాఁడ న ♦ ట్లగునె నుడుమ॥

గీ॥ మంచిచెడ్డలు యోచించి ♦ మఱి రచింప
వలయునుగద వాగ్దత్త మె ♦ వ్వార లైన
దాని వినకయె యెట్టు వా♦గ్దత్త మేను
సేయఁగలదాన నో బావ ♦ చెప్పు మయ్య॥

ఉ॥ కోమలమల్లికాకుసుమ
గుచ్ఛములం సమకూర్చి తెచ్చెదే
కోమలి! యన్నఁ దాఁ గుసుమ
గుచ్ఛములన్ వడిఁ దెచ్చి చంద్రికా
ధామ యొలప్ప నవ్వుచుఁ బ
దద్వయనూపురముల్ ధ్వనించఁగాఁ
జామ గిరక్కునన్ దిరిగి
చంగున జేబున రువ్వెఁ గొన్నిటిన్॥

గీ॥ చెల్వువ చెలువంపు చెయ్వుల • చిత్ర మరసి
మొగముదమ్మిని మవ్వంపు • నగవుబూని
బెడిద ముడివోక యొడలునం•గడలుకొనఁగ
మధురవాణికి ని ట్లను • మాధవుండు॥

గీ॥ పొలఁతి పదిరెండు గడియల • పొద్దుబోయె
నింక నరుదేరఁ గావలె • నేను నన్ను
వెదకు చుందురు మావారు • వెడలి వచ్చి
చుందు రిచ్చోట నింకనిల్వఁ • బొందుగాదు॥

గీ॥ అనుచుఁ దత్తరపాటుతో • నరుగుదెంచె
మాధవుం డది గాంచుచు • మధురవాణి
కొంతతడ వటఁ జింతించి • యంతఁ దాను
నిజగృహంబున కరిగెఁ ద•న్నిశి గతించె॥

మ॥ మరునాఁ డుత్తర మొందు తద్వనితకుం
బంపంగ భావించి తా
నిరుగుఁ బాలకు నొక్కనిం బిలచి
యోయీ బాలకా! నీకు ను
త్తర మొం డిచ్చెద దాని నిప్డు మనచెం
తఁ గేహ మం దుండు నా
సరసీజాక్షి కొసంగు మన్న నతఁ డు
త్సాహంబుమై ని ట్లనుఁ॥

గీ॥ బావ న న్నిప్డు కోమటి ♦ బాసిచెత్తి
ఇత్తికే తీచికొనిపోయి ♦ ఇత్త బెల్ల
ముప్పకొనిపెత్తితేనె యీ ♦ యుత్తలమ్మ
నిత్తు నాపిల్ల కన నతేఁ ♦ డిదుదు ననుచు॥

మ॥ సరసంపుం బలుకుల్ లిఖించి యిడి యా
జాబుల్ గురంగాక్షికిఁ
బలుపుల్ దీయుచు బోయి యిప్పమని యా
బాలుల్ వేసం బంపఁగాఁ
బలుపుల్ దీయుచు బోయి యీయువతిస
ద్మం బంది యాబాలుఁ డు
త్తర మివ్వం గ్రహియించి యీసరసిఁ జ
ద్వం జొచ్చె సేనప్పతో॥

సీ॥ అలరారు నన తేనె♦యల సోన లందున
నధిగతం బైన తీ♦యందనమ్ము
అంభోధి జనియించు ♦ నమృతంబు నందున
నధిగతం బైన తీ♦యందనమ్ము
చెట్టునం బండఁజే♦సినమావిపండు లం
దధిగతం బైన తీ♦యందనమ్ము
నడిపరువమ్ము చొ♦ప్పడ నించుగడల యం
దధిగతం బైన తీ♦యందనమ్ము

గీ॥ దివిఁధి హసియించి చిల్కల ♦ ధిక్కరించి
చొక్కపుం గోయిలల నెక ♦ సక్కె మాడి
మించు నీముద్దుపలుకుల ♦ మించుఁబోఁడి
సంతసం బెట్టుమా యొక్క ♦ సారి నన్ను॥

చ॥ పరిసవశరానురాగతిమి
రం బడి నా నడిజవ్వనం బనఁ
బొసఁగెడి పంకజాకరము
మూఁకొని మూసెను లోచనాబ్జముల్
హాసనములోఁడి కెంజెదవి
దన్న నవాతపరాగ మీనమం
జసనరసీరుహాంబులకు
సంధిలఁ జేసి ముదంబు జూపుమా॥

సీ॥ విరులబంతులఁ గొన్ని ♦ విసరిన యప్పుడు
చెలువంపుఁబూఁదోఁట ♦ దలఁచినాఁడ
విరులబంతులఁ గొన్ని ♦ విసరిన యప్పుడు
విరితీవగీము భా ♦ వించినాఁడ
విరులబంతులఁ గొన్ని ♦ విసరిన యప్పుడు
పలుతెఱంగుల తావి ♦ దలఁచినాఁడ
విరులబంతులఁ గొన్ని ♦ విసరిన యప్పుడు
తలిమంపు దలివమ్ము ♦ దలఁచినాఁడ

గీ॥ విరులబంతుల నొక్కొంటి • విసరి నపుడు
తరుణిరో నిన్ను హృదయాన • నరసినాఁడ
విరులబంతుల నైదింటి • విసరి నపుడు
స్మరశరానల మార్పంగ • నరసినాఁడ॥

గీ॥ సుదతి నీ నుడి తేనియ • సోనలందు
స్నాన మొనరించి యాచమ•నంబు జేసి
బయలు పడినను గాని నేఁ • వదలి బయలు
వెడలి పోదమ్మ యీ వెడ•వింటిగ్రహము॥

చ॥ ఇరువుర మొక్క గేహమున
నేకత ముండి మనంబు దీరఁగా
సరసము లాడఁ గల్గు టది
సాగునొ సాగదొ యైన నెన్నఁడో
పరిపరిభంగులన్ మనసు
వారుచు నున్నది యొక్క చోట ని
బ్బరముగ నిల్వ దేమియు ను
పాయము తోఁచ ది దేమిచిత్రమో॥

ఇట్లు
నీ ప్రియసఖుండు,
మాధవశర్మ".

గీ॥ ఇతని కనురాగభరము జ♦నించె నింక
నేమి చెప్పిన విన కుండు♦నే యితండు
మఱల నొకజాబు వ్రాసి నం♦బర మెలర్పఁ
బంపెదనుగాక యిప్పు డ♦వ్వాని కేను॥

గీ॥ అంచు నుత్తర మొందు లి♦ఖించి యిచ్చి
తెన్నగాఁ బండి లలి గుబా♦ళించు మావి
పండు ల ప్పోరగానికి ♦ రెం [illegible]సంగి
పంపె నమ్మాయలాడి య♦వ్వానికడకు॥

చ॥ పలుగునఁ బోయి బాలకుఁడు
బంధురచంద్రశిలావితర్దికో
పరితల మున్న మాధవుని
పజ్జకుఁ జేరుచు నాపె బంపు ను
త్తర మిడి యేఁగ నెంతయు ము
దంబు భయంబు హృదంబుజంబునన్
బొరిపొరిఁ గ్రమ్మ నుత్తరము
నున్ బఠియింపఁగఁ జొచ్చె నిట్టులన్॥

గీ॥ అతనుసామ్రాజ్యవైభవ♦నతతు లైన
మాధవార్యోత్తమునకు మీ♦ మధురవాణి
వేలుగా నమస్కృతులు గా♦వించి చేయు
విన్నపమ్ములు సర్వమ్ము ♦ విజయ మనఘ॥

చ॥ తమరు లిఖించు లేఖ పత్రిమ
దంబున నేఁ బఠియించితిగ నుఁడీ
తమ మది గోరికల్ గనిన
దానను నుండి కరంబు నట్టులే
తమకము మీఱ నేకతవు
తావుస నచ్చెరు వొప్ప ముచ్చటల్
తమకడ నుండి యాడుచు మె
లంగుట కోరిక నుండి నాకునుగ॥

గీ॥ చంద్రికాసాంద్ర మయి భూపురంధ్రి వెలయు
మేలిబంగరుడాల్ హొయల్ మీఱునాడు
తళుకుమగరాలమేడకు దమరు రండు
సరససల్లాపములఁ బ్రొద్దు జరుప వచ్చు॥

ఇట్లు
తమ ప్రియురాలు,
మధురవాణి."

చ॥ ఇటు బఠియించి మాధవుఁ డ
హీనరుచిప్రథితాంబరంబులున్
స్ఫుటతరశాతకుంభకృత
భూషణజాలము బద్మరాగసం

ఘటితస్ఫారావతంసకయు
గంబు సుధాకరరేఖకాకవత్
కటకయుగంబు దాల్చికొని
గ్రక్కున నచ్చెలిమేడకుం జనెన్।

మ॥ చని బాలాతపరాగబంధురశిలా
స్ఫారప్రఘాణంబు సం
దునం దా నిల్వ వధూస్తనానుగతక
స్తూరీమహావాసనా
ఘన మై కాంచనమల్లికాదినుమశ్శృం
గారంబు నై మేడలోం
గనుపట్టెం మృదుతల్ప మొక్కటి గనం
గం జాలమార్గంబునం॥

ఉ॥ అక్కడి పద్మరాగరుచు
లక్కడి సూనవితానసౌరభం
బక్కడి వల్లకీనినద
మక్కడి నూతనహీరసంచయం
బక్కడి కామినీమణిన
మంచితనూపురమంజునిక్వణం
బక్కడి బంధురాగరులు
నప్పుడ లోనికి నీడ్చె నాతనిం।

ఉ॥ అన్నళినాయతాక్షుఁడు క
రాంగుళి సన్నిహితాంగుళీయరా
జన్నవరత్నరాజిరుచి
సంచయ మంతట సౌధరాజరా
జన్నవరత్నరాజిరుచి
సంగత మై కడు వింతరంగు లీ
న న్నగిపోయి మేడపయి
నఁ దిరుగాడుచు నుండె నయ్యెడన్॥

సీ॥ మల్లెమొల్లల నవ్వ • తెల్లందనమ్ము ధి
క్కారమ్ము సలుపు లం•గా బిగించి
లావు చెందొవపని • తీవకెంపులు నున్న
కావిపన్నియ రవి•కం దొడంగి
చిన్నిగాడ్పులు వీఁచఁ • జెలరేఁగు జిలుగు వ
ల్యెద గుబ్బచన్నుదో•యిం ధరించి
మొనలేని మగరాల • పని గొన్న వన్నె వ
న్నానె కెంపు జిన్ని యొ•డ్డాణ మూని

గీ॥ డంబు మానికముల తావ•డంబు గల్గి
పొలుపు గళ లీను జాళువా•బొమ్మ పోల్కి
మెవ్వుల బిత్తరిచూపుల • మించి వచ్చె
మంజులాంబుజపాణి య•మ్మధురవాణి॥

చ॥ నిజపదనూపురంబులు ధ్వ
నించఁగ ఘల్లునఁ గాలిగజ్జెలుక్
గజగమనంబులో నతని
కై చని పయ్యెద యొత్తి నెల్లఁగన్
భుజమునఁ గొట్టి యాపలికి
బోవఁగ మాధవుఁ డామె వెంట న
క్కజముగఁ బోయి కోకకొన
గ్రిక్కునఁ బట్టి వదించె నిట్టులన్।

సీ॥ పలుకొప్ప గిల్కుటం • దెలు(మోవ నొకవరి
నృత్యవైఖరి నొనరించ రాదె
ముద్దు లొల్కఁగఁ బల్లు • పురుడించి తీయని
పాటపవ్వింపు • మీటరాదె
పిసిపించి హాయి హా • యనిపించఁగా మించు
పాటల నందందు • బాడరాదె
పరమభక్తిని బూజ • జరుపుచు సజనకు
నీరాజనంబులం • దివ్వరాదె

గీ॥ అంకమునఁ జేరి ముచ్చట • లాడరాదె
అతనుసౌఖ్యమ్ము లెన్నియు • సమరకున్న
బాల యీరీతి నేల నా • మ్రోల నిలచి
పయ్యెదన్ విదలించి యా • వలికిబోవ।

చ॥ అనువుఁ గటాలుసం దిరిగి
యట్టులనే విరిసెజ్జపజ్జ కా
తనిఁ గొనిపోయి నిల్పి కర
తామరసంబున సెజ్జ దట్టి చం
గున నెగురంగఁ దత్కుసుమ
గుచ్ఛము లొక్కటఁ జింది తద్వ్యథా
మణి తను నొంది యాయువతి
మాజులతోఁ వచియించె వానికిన్॥

గీ॥ మాధవుం డది గాంచి యమ్మగువ నరసి
మందహాసమునన్ మించి ♦ మదకరింద్ర
యాన భవదుపాంతంబున ♦ నమరు నట్టి
ప్రసవగుచ్ఛంబు లిమ్మని ♦ పాన్పు నెగసె॥

ఉ॥ జక్కవపక్కు లొక్కయెడ
సాఁగుచుఁ జక్కని ముక్కులన్ గదుర్
నిక్కఁగఁ జేసి మేల్కొనియె
నిస్తులతన్ భ్రమరీప్రకాండముల్
చక్కలిగింతలన్ బొసఁగ
సాఁగెను బంకజ మందు సౌరభం
బెక్కువ యై జనించె ముద
మెంతయు నుద్భవ మయ్యె వారికిన్॥

చ॥ నటన్మ మరన్ గపోతమిథు
నం బొనరించెఁ బదద్వయోల్లసత్
కటకచయంబు లెంతయు ము
దం బొసఁగన్ మధునాదవైఖరిన్
దిటముగఁ గైరవంబు లవి
తేజము వాయ నభస్స్థలంబు వి
స్ఫుటతరశాంత మూన నెఱి
ఘన్ దొలిదిక్కుల ఘటించు సంతసన్।

చ॥ కలువలతేనిమండలము
గాంచెఁగ ముత్తైపుగ్రోవ వర్షమున్
జలధరమున్ విజృంభణము
నన్ గురిపించ నభఃప్రదేశమున్
జలనము సంద సందముగ
సారసముల్ దనతోడ నాడఁగన్
బళిరె మయూర మొందు నట
నం బొనరించెను గోర్కె పెంపునన్।

చ॥ కలువలతేనిమండలము
గాంతులఁ బాయ మెఱుంగుదీవయున్
గళల దొలంగ వర్ష ముడు
గన్ జెఱుకాల్వలు వృద్ధిగాఁగ నా

వ్వలరఁగఁ గాంతిమించు జెగు...
    రాకులకుఁ మిసిమిచ్చు విద్రుమా
వళి కట విక్రమం బెనఁగ
    బాపురె తచ్ఛిఖీ యాపె నాట్యముఁ॥
చ॥ సురతమహోత్సవంపు సొగ
    సుఁ సుఖముఁ గ్రహియించి తృప్తిమై
విరితల్పమ్ము డిగ్గి యట
    వెల్గెడు సుస్మితహీరహారబం
ధురకనకాననంబులకు
    దొలుప్రవడఁ దమ పాదముల్ కరం
బరిగిరి దాన గూర్చెనిరి
    హస్తము హస్తమునందు జేర్చుచుఁ।
చ॥ ఇది మొద లెవ్వ నఁ విడి మ
    ఱచ్చటికిం జన నంచు నొట్టు పె
ట్టెదవొ మదాత్మ కెంతియు ఘ
    టించెదు నుమ్మి సఖా ప్రమోద మి
య్యది గ్రహియించి మా జనక
    య ట్లొనరించుమి యన్న మాధవుం
డది విని చెప్పసాఁగె నట
    నాపెకరంబుఁ గరంబు జేర్చుచుఁ।

గీ॥ సారసాక్షి త్వదీయమ•నోరథంబు
తీరు నంతటివఱకు నే • స్త్రీ మొగంబు
జూడ నిది నిశ్చయంబు వే • యాడ నేల
కలదె నీకన్న జాణ జ•గంబు నందు॥

చ॥ దినదిన మీరు మేడ కరు
దెంచుడు రేవు సువర్ణ కర్ణ భూ
షణములు మల్లికాగరును
జందురుకావి రంగుచీరలుం
మణివలయప్రరాజి ప్రథ
మానవి నిర్మలహారవారముల్
గొని దయసేయుచుండి యిచటం
గూర్మి మెయిన్ సుఖాయించఁగా నగున్॥

గీ॥ భూషణంబుల కేమి జాం•బూనదంపు
చేలముల కేమి మణికంక•ణాల కేమి
యంగరాగాదులకు నేమి • హా పరస్ప
రానురాగంబు గల్గిన • నన్ని రానె॥

గీ॥ పొలఁతిమిన్నరొ యింక నేఁ • బోయి వత్తు
మఱువబోకుమ నన్ను నీ • మది దలంప
నీవు చెప్పిన యట్లె య•న్నింటిఁ దెత్తు
ననుచు నుడి మాధవుండు దా • నరుగు దెంచె॥

చ॥ పొలఁతియు వానిఁ బంపి తలు
    పుల్ కిటికిలను మూసివైచి ది
వ్వెల సవరించి మించి యతి
    వేగమునన్ విరిపాన్పు డిగ్గి మైఁ
దళతళ లాడు భూషణవి
    తానములన్ దగుచోట దాఁచి పూ
వులతలిమమ్మున న్నిదుర
    బోవ మొదల్కొనె విస్మితమ్ముగన్॥

చ॥ తెలతెల వాఱెఁ దూర్పుదెస
    తేజము వాసెను దారకావళుల్
వెలవెల బాఱె దివ్వెలును
    వీవఁగ సాఁగెఁ బ్రభాతమారుతం
బులు విహగావళుల్ వెడలి
    మ్రోయఁగఁ జొచ్చె పదాయుధంబు లు
ద్గళగతి మ్రోయసాఁగెఁ బ్రమ
    దంబు కరంబు వహించి యంతలోన్।

సీ॥ కలకల నవ్వ జ♦క్కవపక్కి తుటుములు
    గొల్లున నేడ్వ జ♦కోరకములు
కలకల నవ్వంగఁ ♦ గంజాతపుంజముల్
    ప్రమదంబు వాయఁగఁ ♦ గుముదవితతి

కలకల నవ్వ ది • క్కామినీవ్రాతంబు
మిన్నులఁ జెలింపఁగా • మిహిరజాతి
కలకల నవ్వ ది • క్కామినీధవమణుల్
క్రొత్త కోడండ్రు సం • కోచ మంద
గీ॥ సకలకలుషవిదారణ • చాతురీధు
రీణ వేదవిజ్ఞనసమ • ర్పితమహార్ఘ్య
జలకణానుకరుండు త • చ్చండకరుఁడు
గగనతలమునఁ దోఁచెఁ బ్రా • గ్భాగ మందు॥
గీ॥ చెలువ గృహకృత్యములఁ దీర్చి • శ్రీఘ్రసరణి
షడ్రసవిరాజమానభో • జన మొనర్చి
కొంతకాలంబు నిదురించి • యంత లేచి
సంజరాగంబు పైకొను • సమయమందు॥
సీ॥ ఇమ్ముగఁ జుట్టి వీ • డెమ్మునుం బొసగించె
వైదూర్యమయ హేమ • భాజనమున
చిగురుగెంగేల జ • క్కఁగఁ జేసె మధుసార
ఘాటోపమానశ • య్యాతలంబు
ముందు పీఠంబున • యందుంచెఁ గాస్తూరి
కాదివస్తూల్లస • దగరుపేటి
అల్లనల్లన వీవ • నవకాశముగఁ దీర్చె
శయ్యాతలోపరి • చామరంబు

గీ॥ సాంద్రరుచ్యసమానజా•జ్వల్యమాన
రత్నసంచయదీపికా•రాజి యాప
చొక్కపుం గడి గోడల • నక్కజముగ
వెలుగఁగాఁ జేసెఁబ్రియురాక•దలఁచికొనుచు॥

సీ॥ పిల్లవాయువు లల్ల • నల్లన వీవంగఁ
జెలరేఁగు గెంజాయ • చీర గట్టి
మైదువన్నియలఁ బె•న్నారు బనారసు
కలువపూవుల కంచు•కంబు దొడఁగి
తగ గుబాళించెడు • మృగనాభిపంకంబు
పునుగుజవ్వాది మై • పూఁత బూసి
తళుక్కొత్తు నెత్తావి • దులకించు మల్లియ
మొల్లలం జెన్నువా•టిల్ల దుఱిమి

గీ॥ వజ్రవైడూర్యమరకత•పద్మరాగ
రత్నసంచయఘటనావి•రాజమాన
శాతకుంభవినిర్మితా•సనము నందు
పొలఁతి గూర్చొనెఁ గేలఁ గ•పోల మూఁది॥

ఉ॥ పాదవినాదముల్ విన గు
బాలున ముంగడ కేఁగుచుఁ దెసల్
దాఁ దిలకించి యెల్లయెడ
లం బ్రియుఁ గానక యుంట జేసి ॥రా

లేవె ప్రియుండు! కారణము
లేవే! మ గొందుల పైన దుర్గుణం
చేసినవాఁడొ నాపయిన
నే మిక యాలస మేల చేసిరొ॥
శా॥ ప్రగీతంబుల వించు నృత్యములఁ దా
నీక్షించు చున్నాఁడొ! యిం
కే గోష్ఠిం బఠించు చుండెనొ మఱే
యే సౌఖ్యముల్ గాంచు స్త్రీ
యాగారం బునమాఱు యే మఱచెనో
యయ్యారమ్యె నాపైననే
తాఁ గోపంబు వహించినాఁడొ సుఖ మం
దం దల్చెఁడో నాయెడన్॥
గీ॥ నాపొడం బోలు చక్రద•నంబు పంబు
గాంచి యదివాలు కేకల•కంఠ వజ్ర
జేరినాఁ డొక్క యన్నిఁకఁ • జేరరాఁడొ
యేమి కా నున్నదో నాకు •నేమి గతిరొ॥
గీ॥ పగలు నాకెముల్ దె మ్మ•నంగ నతఁడు
మదిని సంకోచ మందెనో • మాయలాడి
యనాఘ ప స్నించినాఁడొ యీ•దినమునింత
పొద్దు బోయిన రాఁడేమి • పొటుపు బుట్టె॥

మ॥ వరకార్యంబుల నెన్నియో తొలుత స
ల్పం జాలుటం జేసి య
ప్పరమేశుండు దయార్ద్రభావమున సౌ
భాగ్యాలయం బైన యీ
వరజన్మం బిడ సర్వసౌఖ్యములఁ జెం
దన్ రాదో? మత్ప్రియా!
చిరమా నూతనయావనంబు సుమనో
ధీరత్వముల్ నిత్యమా॥

మ॥ కరముల్ గన్నులు దీప్తి భావము లెటుం
గన్ జేయఁగా నిన్ని వా
నరముల్ పట్టెను నేఁడుగా టొరకె ని
చ్చన్ ముచ్చటాడంగ ని
క్కరణిన్ నేఁడును నల్కఁ బూన మరలన్
గాలంబు చేకూడునా
చిరమా నూతనయావనంబు సుమనో
ధీరత్వముల్ నిత్యమా॥

మ॥ పరివేష మ్మొసఁగన్ బయోధర మటన్
వ్యాపించ నొ నంతదాఁ
క రసాసక్తమె కాని యేకరము వం
కన్ జూడఁగాఁ బోదు నీ

నగస్థం జేరఁగ నీయువా యిహమునన్
జాలింపవా యల్కలన్
దిరమా నూతనయౌవనంబు సుమనో
ధీరత్వముల్ నిత్యమా॥

మ॥ వచియన్ మాటలఁ దొ[illegible]పా పొందవు నీ
పదంబునం దాసిచన్
వరయున్ దేహము సంతటన్ వళులు నిం
డన్ బోలు బింబప్రిధా
ధరమున్ గాంతులఁ బాయు నవ్వున గనో
త్సాహంబు నీఁ డల్కయుం
తిరమా నూతనయౌవనంబు సుమనో
ధీరత్వముల్ నిత్యమా॥

మ॥ పరసా తా సజివ్వసంబు గమునన్
జానత్వముం బోయి య
జ్జర పైకొన్న లతాంతతల్పశయనో
త్సాహంబు వాటిల్లి య
కల్లయున్ వచ్చునె నేఁడు నీయలుక యిం
కన్ రావ దేలా ప్రియా!
తిరమా నూతనయౌవనంబు సుమనో
ధీరత్వముల్ నిత్యమా॥

ఉ॥ అక్కట రాయబారమున
కా యనుదెంచెనివారె వారు నా
కెక్కడ పోవువా రెవ ర
టే దొరుకన్ బనుపంగ వానికిన్
దక్కులు లేక నాగతి వి
దంబముగా నటియించువారె నా
రెక్కరణిన్ బ్రియున్ బిలువ
నిచ్చటి కాలేఁపు నేఁడు దేరమన్।

చ॥ చుఱుకు చుఱుక్కనన్ బొడుచు
చున్ బలుతూపులఁ గల్త పెట్టుచున్
బఱపి మేనిపైఁ బఱుగు
వాఱుచు నాయెద ఘూము లేటికిన్
ఱరపెద వ్రాయి నీశరగ
ణంబులఁ నీగతి నాఱుచుం బరం
పరలుగ మేన నాటి వెన
మఱిప్రియునిన్ గొని తెమ్ము మన్మథా।

గీ॥ మాధురీడంబరక్రమ • మంజువాక్య
జాతరచనాధురంధర • నమదశారి
కీరకలకంఠపారావ • తారవములఁ
బంచి ప్రియుఁ గలిగించు మో • పంచబాణ।"

తనుదాహం బొదవన్ బయోఘటము హా
స్తం బూచుచుం ద్బ్యో
మ్మను నాకమణి చింత లేనియెడ న
న్నైశ్వర్యముల్ నిమ్ము హో
జనముల్ గానె మహాటవీస్థలవిరా
జచ్ఛ్రాంది శ్రీకాన్ వైఖరిన్ ।
మ॥ తనువంటాత విశేషజాడ్యకలనా
ఘ్యాంసంబు గావించఁగా
వనజాద్యౌషధిసంచయం బనఁగిసన్
బాలింపవే యన్న హో
వనిశం బుప్వొషు లూను కాంతి జనదే
నైశ్వర్యముల్ నిమ్ము హో
జనముల్ గానె మహాటవీస్థలవిరా
జచ్ఛ్రంది శ్రీకాన్ వైఖరిన్ ।
మ॥ లవ మాలన్యము నయునాఁడు ప్రియుఁ దే
లా రాఁడు నేఁ డెంచు ఖ
న్నవుచుం ద్వారముఖంబు జేరి నిజము
శ్రీన్వేషగాయత్త మూ
వుఘుఁజోడిం దరిఁజేరఁ బట్టి విరిపా
న్పుం బాయఁగాఁ గల్గు మా

చ॥ అలుక వహింప నేల మగు
వా సుమబాణుఁడు మించి వాడివా
ములుకుల నాటువాఁడు తఱి
పోయినచో మఱి రాని కీ మవం
బులు నెఱి కిట్టులుండ విటుఁ
బోయిన లేఁ జవంబురాని దీ
యలుకలతో ముతం దమక
మారున కౌఁగిట నాదరింవవే॥

చ॥ వకియ వచింప నేమిటికి
చా లిఁక జాణతనంపుమాట లే
నిఁక సహింయింవలేను నను
నేమి యొనర్చిన నమ్మతంబె యా
రక నిను వీడలేను వడి
రాకొ పయింబడి ముద్దుగొంచు నీ
డక నిను వొక్కపుం గవుఁగి
టగా గ్రహియించెద నంచుఁ జెప్పుచున్॥

గీ॥ మాధవుఁడు మెల్ల మెల్లంగ • మధురవాణి
దరికి జేరుచుఁ గైఁబడి • యురమునందు
నురము నొత్తుచు ముద్దాడ • వరలె నప్పు
గామెయును నమ్మతించె న•య్యాలె పేమి॥

గీ॥ పైన దిగ్వారు న వ్వారిం పాన్ను జేరి
యచ్చ దీరఁగఁ గ్రీడించి మెన్నటికిని
నొకరి నొక్కరు వీడక యుండు నట్లు
బాస లొనరించి యరిగి రా వానములకు॥

ఉ॥ ఆదిన మూడి నేటికిఁ బ్రి
యంబున వార లనంతభోగభా
గ్యోదయు గాచు నొక్కరి మ
నొక్కరు వీడక ప్రేమయుగా జనం
గాఁ దనరారు వారలు ను
ఖంబు యశంబు నయంబు డంబు నెం
తే దయ నిచ్చుఁగాక పర
మేశుఁడు వీరల వృద్ధి గోరుచున్॥

ఉ॥ ప్రేమ యనంగ నెంతటిదో
వీరల యీ చరితంబు విన్న య
ట్టే మది గోచరం బగును
వీడక యీగతి నొప్పువారు నీ
ప్రేమ రహింగ నట్టి పసి
పిల్లలఁ జేర్చి వివాహ మంచు న
య్యో మన హిందుదేశమును
నాశము నంతకు దాడు సేయు ధీ

రామరనాథు లిద్ది విడ
  నాడి తగఁగావయు సంధి యెట్టిదో
ప్రేమ యవంగ నెట్టిదో ల
  భించెను భర్త గ్రహించు నప్పుడే
కాము వివాహముఁగా జరపి
  తప్పక వృద్ధ ఘటంత్రు గాక హిం
దూమహనీయ దేశమునఁ
  ద్రోయక యుందురు గాక పిల్లలఁ
బాముల పాలిటఁ మనవి
  భావము నెంతురు గాక నాయెడఁ
దామసి మంద కిం చెనఁగు
  తప్పులఁ బ్రోతురు గాక ధీధనుల్!



